# ఆంధ్రగ్రంథాలయ ప్రెస్, లిమిటెడ్,
# బెజవాడ.

(౧౯౧౩ సం. ఇండియన్ కంపెనీల ఆక్టు క్రింద రిజష్టరు చేయబడినది.)

భాగము ౧కి రు ౨౫ లు చొప్పున ౧౨,౦౦౦ భాగములుగ విభజింప బడినది.

భాగముల సొమ్మున్ను దరఖాస్తుతో రు ౫ లు; అలాటుమెంటు అయినప్పుడు రు ౫ లు; మిగిలినసొమ్ము ఒక్కొక్క మాసమునకు తక్కువకాని వ్యవధిగల 3 వాయిదాలలో ఇయ్యవలెను!

## డైరెక్టర్లు

౧ శ్రీపైడా చినరామకృష్ణయ్యగారు, జమీందారు, బ్యాంకరు, కాకినాడ.

౨ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, ఆంధ్రపత్రికాధిపతి; డైరెక్టరు, స్వరాజ్య ప్రింటింగు అండు పబ్లిషింగుకంపెనీ; డైరెక్టరు, హేండుస్పిన్నింగు అండు వీవింగుకంపెనీ, మద్రాసు.

3 సూరి వేంకట నరసింహశాస్త్రిగారు, ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ కార్యనిర్వాహకసభకు అధ్యక్షులు; రామమోహన కేంద్ర గ్రంథాలయమునకు అధ్యక్షులు; బెజవాడ.

౪ నడింపల్లి వేంకటలక్ష్మీనరసింహారావుపంతులుగారు, బార్-ఎట్-లా, మేనేజింగు డైరెక్టరు, ఆంధ్ర కర్మాగారము; రాయకూటే ఇండస్ట్రియల్ బ్యాంకి కలకత్తా, యొక్క గుంటూరు ఆఫీసు మానేజరు; ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసు సంఘమునకు కార్యదర్శి, గుంటూరు.

౫ వావిళ్ల వెంకటేశ్వర శాస్త్రులుగారు, ప్రొప్రయిటరు, వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండు సన్సు; డైరెక్టరు, ఇండియన్ పబ్లిషింగుహౌసు; శ్రోత్రియందారు, మద్రాసు.

౬. కావ్యనిధి, చెలికాని లచ్చారావుగారు, సంపాదకులు; శ్రీరామవిలాస గ్రంథమాల, అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము; పత్రికాధిపతి, ఆంధ్రభాషావిలాసిని, స్థాపకులు, ఆంధ్రపరిశోధకమహామండలి; జమీందారు, చిత్రాడ, (గోదావరి).

౭ బిక్కని వేంకటరత్నంగారు, కార్యదర్శి, శ్రీబాలసరస్వతీ గ్రంథాలయము, భూస్వాములు, చోడవరము, రామచంద్రపురం తాలూకా, గోదావరిజిల్లా.

౮ బచ్చు నాగభూషణరావుగారు, కార్యదర్శి, జ్ఞానదాయినీ గ్రంథాలయము; భూస్వాములు; బ్యాంకరు; పేరుకలపూడి, గుంటూరుజిల్లా.

౯ పుతుంబాక నరసయ్యగారు, కార్యదర్శి, శ్రీ వేంకటాద్రినాయని జాతీయపాఠశాల; భూస్వాములు; పెదపాలెం, గుంటూరుజిల్లా.

౧౦ పురాణం సూరిశాస్త్రిగారు, బి. ఏ, భూస్వాములు; ప్రొప్రైటరు, మచిలీపట్టం

౧౧ బొడ్డపాటి హనుమంతరావుగారు, కార్యదర్శి, శ్రీసత్యనారాయణ వరప్రసాద గ్రంథాలయము; భూస్వాములు; బొడ్డపాడు, కృష్ణాజిల్లా.

౧౨ పుచ్చా శ్రీరామశర్మగారు, కార్యదర్శి, ఆర్యబాలసమాజము; భూస్వాములు; పెదపాలెం; గుంటూరుజిల్లా.

౧౩ అయ్యంకి వేంకట రమణయ్యగారు, ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ గౌరవ కార్యదర్శి, రామమోహన కేంద్రగ్రంథాలయగౌరవకార్యదర్శి, బెజవాడ.

## బ్యాంకర్లు

టాటా ఇండస్ట్రియల్ బ్యాంకి, మద్రాసు, హైదరాబాదు (డక్కన్)
కలకత్తా రాయకూట్ ఇండస్ట్రియల్ బ్యాంకియొక్క గుంటూరు బ్రాంచి.

## ఆడిటరు

జి. నరసింహంగారు, యస్.ఏ.ఏ, ఎఫ్. ఆర్.యస్.ఏ, 307 లింగిశెట్టివీధి, మద్రాసు.

## లీగల్ అడ్వయిజరు

తుర్లపాటి వేంకటేశ్వరరావుగారు, బార్-ఎట్-లా.

## మేనేజింగు డైరెక్టరు

అయ్యంకి వేంకటరమణయ్యగారు.

## రిజిష్టర్డు ఆఫీసు—బెజవాడ

వివరములకై మేనేజింగు డైరెక్టరుగారికి వ్రాయుడు.

ఆంధ్రదేశాభ్యుదయమునకు అత్యంతావశ్యకములగు అమూల్యగ్రంథప్రకటనమునకు కొద్దిరోజుల లోనే పూనుకొనును,

ఇదివరకే పనిని ప్రారంభించి యుండుటచేత, మొదటిసంవత్సరమునుండియు లాభము పంచిపెట్ట బడును. మొదటిసంవత్సరము నుండియు లాభము పంచిపెట్టునట్టి కంపెనీ ఇదియొక్కటే.

వివరములకు వలయువారిట్లు వ్రాయవలెను:—

ఆంధ్రగ్రంథాలయ ప్రెస్, లిమిటెడ్, బెజవాడ.

# బాలగంగాధర తిలక్ మహారాజు

## యొక్క సంపూర్ణ ఉపన్యాసములు - జీవితచరిత్ర.

భారతవర్షముయొక్క రాజకీయ చరిత్రను మీరు చదువదలంచినారా?

భారతవర్షముయొక్క స్వాతంత్ర్య పోరాటమును మీరు గుర్తెరుంగ దలచినారా?

## అట్లయిన

బాలగంగాధర తిలక్ మహారాజుయొక్క సంపూర్ణ జీవితచరిత్రమును, సంపూర్ణ ఉపన్యాసములను తప్పక చదువుడు. ఈగ్రంథమును చదువని భారతీయుడు—దేశమననేమో, దానికై పాటుబడుటఎట్లో, ఎప్పటికిని తెలిసికొన జాలడని నిశ్చయముగా జెప్పగలము.

సుప్రసిద్ధాంధ్రదేశభక్తులును, పశ్చిమకృష్ణామండల కాంగ్రెసు సంఘమునకు కార్యదర్శియును, శ్రీకృష్ణజన్మస్థానవాసముచే పవిత్రులును అగు శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రి, బి. ఏ. గారిచే వ్రాయబడినది. ఇట్టిమహాగ్రంథముయొక్క వెల రు 2 లు మాత్రమే.

వలయువారిట్లు వ్రాయవలెను:—ఆంధ్రపరిషత్తు, బెజవాడ.

---

# ఆంధ్రభాషాపోషకులకు విజ్ఞప్తి.

రాజమహేంద్రవరమునగల గవర్నమెంటు కళాశాలలో సంస్కృతోపాధ్యాయులుగ పనిచేసి అయిదువత్సరములక్రిందట కీర్తిశేషులైన మాతండ్రిగారగు ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రులుగారు వారి జీవితాంత్యవత్సరములలో, యాధ్యాత్మికానందము ననుభవింప గాంక్షించి, సంస్కృతభారతమును నిర్వచనముగ నాంధ్రీకరింప మొదలిడిరి. ఆదిపర్వాది మొదటి నాలుగైదుపర్వములు, యుద్ధపంచకము, స్వర్గారోహణాపర్వములును మొత్తముమీద సుమారు 13 పర్వములను పూర్తిచేసిరి. ఈయాంధ్రీకరణకాలమందే కవిత్రయమువారి యాంధ్రీకరణములోని స్వల్పపులోపములను దిఙ్మాత్రముగ చూపుచు "భారతపక్షి" అను పేరుగల గ్రంథమువ్రాసి, పిఠాపురమున కొంతకాలముక్రిందట ప్రచురింపబడుచుండెడి "కవిత" యను మాసపత్రికలో ప్రకటించిరి. వీరు తమ భారతమునకు "ఆంధ్రవ్యాస భారత నవనీతము" అనియు, అందలి పర్వభాగములకు "ధార" లనియు పేరిడిరి. కవిత్రయమువారిచే నాంధ్రీకరింపబడక విడువబడిన సంస్కృతములోని కథాఘట్టములను వీరు విపులముగ నాంధ్రీకరించిరి. కవిత్రయమువారాంధ్రీకరించిన భాగములలో విపులముగ నున్నవానిని వీరు సంగ్రహముగనే వ్రాసిరి. కవిత్రయమువారిచే యాంధ్రీకరింపబడని భాగములను వీరిచే విపులముగ నాంధ్రీకరింపబడినట్టి వానిలో కొన్ని భాగములు:—

1. కణికుని రాజనీతి. 2. సనత్సుజాతీయము. 3. భగవద్గీత. 4. విష్ణుసహస్రనామములు మొదలైనవి.

వీరు అనుకరించిన గ్రంథములకంటె నీభారతము చాలసులభశైలిలో వ్రాయబడినట్లు పలువురభిప్రాయపడుచున్నారు. వీరిభారతములో నేభాగములనైనగాని లేక అంతయు ప్రత్యేకముగ గాని, ముద్రింపించి ప్రకటింపబూనుకొన లక్ష్మీపుత్రులను, భాషాభిమానులను ప్రార్థించుచున్నాము. ఈగ్రంథమును అచ్చువేయింపదలచు యౌదార్యవిశ్వాదయ్యులు, మహాశయులు, వితరణశీలురు, యీగ్రంథమునుగూర్చి యీక్రింది ఎడ్రెసుగలవారికి వ్రాసి అన్నిసంగతులు తెలిసికొనం గోరుచున్నాము.

అడ్రెసు:—

ఆకుండి వ్యాసేశ్వరుడు,
"శ్రీశాంతావ్యాసనికేతనము"
ఆర్యాపురం, రాజమండ్రి.

ఇట్లు
విన్నవించు విధేయులు,
ఆకుండి వ్యాసేశ్వరుడు.
ఆ. వేంకటశాస్త్రి.

# దక్కను మిల్ స్టోర్సు కంపెనీ, లిమిటెడ్,
# బెజవాడ.

---

(1913 సం॥ ఇండియన్ కంపెనీల ఆక్టుక్రింద రిజష్టరు చేయబడినది)

## మూలధనము రు 3,00,000.

భాగము ౧కి రు 100 లు భాగముల సొమ్మును ధరఖాస్తుతో రు 20 లును, అలాటుమెంటు అయినప్పుడు రు 20 లును, మిగిలినసొమ్ము ఒక్కొక్కమాసమునకు తక్కువకాని వ్యవధిగల 3 వాయిదాలలో ఇవ్వవలెను.

## డైరెక్టర్లు:

1 మోతే నారాయణరావుగారు, జమీందారు, విస్సన్నపేట గుండేపల్లి ఎస్టేట్సు; డైరెక్టరు, ఆంధ్రకర్మాగారము, లిమిటెడ్, గుంటూరు; ఏలూరు.

2 మోతే నరసింహారావుగారు, జమీందారు, విస్సన్నపేట గుండేపల్లి ఎస్టేట్సు; డైరెక్టరు, ఆంధ్రకర్మాగారము, లిమిటెడ్, గుంటూరు; ఏలూరు.

3 నంబూరి వేణుగోపాలరావుగారు, ప్రెసిడెంటు, శ్రీకృష్ణాజూట్ అండు కాటన్ మిల్సు, ఏలూరు; వైస్ ప్రెసిడెంటు, యస్. కె. పి. వి. వి. హెచ్. హెచ్. స్కూలు, బెజవాడ; ఆనరరీ బెంచిమేజస్ట్రేటు; డైరెక్టరు, విజయవాడ కోఆపరేటివ్ బ్యాంకింగు యూనియన్, బెజవాడ; డైరక్టరు, ఏషియాటిక్ కమర్షియల్ అస్యూరెన్సు కంపెనీ బొంబాయియొక్క మద్రాసుబోర్డు; ప్రొప్రైటరు, శ్రీబాలకృష్ణారైసుమిల్లు; అండు కంట్రాక్టరు, కనకదుర్గా రయిసుమిల్లు, బెజవాడ.

4 ఉప్పలపాటి బ్రహ్మయ్యగారు, ల్యాండు లార్డు అండు ప్రొప్రైటరు, శ్రీరామలింగేశ్వర రైసుమిల్లు, గుడివాడ.

5 వీరమాచనేని రంగయ్యగారు, ల్యాండులార్డు అండ్ ప్రొప్రైటరు శ్రీ వేంకటేశ్వర రైసు మిల్లు, గుడివాడ.

6 కానూరి వెంకటాచలపతయ్యగారు, ల్యాండులార్డు అండ్ ప్రొప్రైటరు, శ్రీవెంకటకనకదుర్గా మైనింగుకంపెనీ, (నెల్లూరు;) కవుతవరం, కృష్ణాజిల్లా.

7 అడపా రంగయ్యగారు, ల్యాండులార్డు అండ్ ప్రొప్రైటరు, శ్రీశివశంకరరైసుమిల్లు, నరసన్నపాలెం, వీరవల్లిపోస్టు, పార్టనరు ఆఫ్ శ్రీరామలింగేశ్వర రయిసుమిల్లు, గుడివాడ.

8 కలిదిండి గంగరాజుగారు, ల్యాండులార్డు అండ్ ప్రొప్రైటరు, శ్రీరామవరప్రసాద రైసు మిల్లు, తాడేపల్లిగూడెం.

9 కన్నెగంటి వెంకయ్యగారు, ల్యాండులార్డు అండ్ ప్రొప్రైటరు, శ్రీ రామలింగేశ్వర రైసుమిల్లు, దుగ్గిరాల.

10 గుడ్లవల్లేటి గోపాలరావుగారు, పార్టనరు ఆఫ్ బాబు ఏ. వి. రాయి అండు కో. అండు ల్యాండు హోల్డరు, బెజవాడ, (ఎక్సుఅఫిషియో.)

## అక్కవుంట్సు విత్

ది ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, బెజవాడ.

ది రాయకట్ ఇండస్ట్రియల్ బ్యాంక్, లిమిటెడ్, గుంటూరు.

ది తాతా ఇండస్ట్రియల్ బ్యాంక్ లిమిటెడ్, మద్రాసు.

## ఆడిటర్

జి. నరసింహంగారు, యఫ్. ఏ. ఏ. యఫ్. ఆర్. యస్. ఏ., 307, లింగిశెట్టివీధి, మద్రాసు.

## లీగల్ అడ్వయిజరు

కందుకూరి వటుకభైరవమూర్తి పంతులుగారు, జిల్లాకోర్టు వకీలు, బెజవాడ.

## మేనేజింగు ఏజంటు

గుడ్లవల్లేటి గోపాలరావుగారు.

## రిజష్టర్డు ఆఫీసు—బెజవాడ.

హించి కటాక్షించవలయునని ప్రార్థించెను. అంత నా యోగిపుంగవుడు మరల నొక సంవత్సరమాగి సమ్మనిరెను. అటులనే శ్రీహరిదాసుగారు మహాసత్పురుషవర్గమున సద్గురువరుల దర్శించి యుపదేశమునందుకొని తదాది వారియుపదేశానుసరణమున సంతతము స్వయముగ భగవన్నామ సంకీర్తనమును జేయుచు నితరులచే జేయించుచు, నామ మాహాత్మ్యమును ప్రకటింపుచు చరించుచుండిరి. భగవన్నామముచే గొన్ని మహిమములు గలుగునని వీరిజీవితమున కొన్ని నిదర్శనముల జూపించిరి. ఒకచోట వర్షము గురిపించిరి. ఒకచోట యాత్రికులకందరకు నాకసమున దివ్యతేజోవిరాజమానమూర్తులగు శ్రీ సీతారామచంద్రుల జూపించిరి. వీరి కన్నదానమును జేసి, భూతతృప్తి జేయుటయం దతిప్రీతి. అందుచే వీరు గృహస్థాశ్రమమున కాకినాడయం దున్నప్పు డనేక సమారాధనముల జేయుచుండెడివారు. అనంతరమందు భార్యావియోగ మయినతరువాత బెజవాడ నింద్రకీలాద్రిపైనున్న శ్రీకనకదుర్గాంబాదేవి సన్నిధిని తపమాచరించి శ్రీదేవి యనుగ్రహ దత్తకాషాయవస్త్రధారులై తనువును, ధనమును, మనమును శ్రీహరి కర్పణము జేసిరి. ఇంద్రకీలాద్రిపై శ్రీదుర్గాలయ సమీపమున నున్న కోనేటి సోపానాదులు, శ్రీమంగళగిరి లక్ష్మీనృసింహస్వామి వారియాలయ పినానములగు బంగారుశిఖరములు, శ్రీస్వామివారి గోపురవిమానములగు సుమారు ముప్పదివేల రూప్యముల విలువగల పదునొకండు బంగారుశిఖరములు శ్రీభద్రాద్రికిబోవుమార్గమున ములకలపల్లియను గ్రామమున చైత్రమాస శుక్లపక్షమందలి యన్నసత్రము, వల్లభాపురమునగల శ్రీరామనామధర్మసత్రము మొదలగునవి శ్రీహరిదాసుగారి కైంకర్యములలో గొన్నియని చెప్పవచ్చును. ఇపుడు మిగుల వైభవమున, శ్రీసూరి మార్కండేయశాస్త్రిగారిచే నడుపబడుచున్న శ్రీఅగిరిపల్లి వేదశాస్త్రపాఠశాలకు శ్రీహరిదాసుగారు ప్రారంభమున చేయూత నిచ్చినవారు. అనంతరమున వీరు తురీయాశ్రమమును స్వీకరించి కొలదికాలము శ్రీభూమానంద తీర్థులను నామమున యద్వైతబ్రహ్మానందమ్మున ననుభవించి రెండువత్సరముల క్రిందట శ్రీమంగళగిరియందే సిద్ధినొందిరి. వీరిజీవిత మాదర్శప్రాయము. ఇందు బ్రహ్మచర్య మవిప్లుతనిష్ఠాయుతము. గార్హస్థ్య మనవరతాన్నదానయుతము. వానప్రస్థ మపూర్వ హరికైంకర్యోపేతము. తురీయాశ్రమ మంతరనుభవిత బ్రహ్మానందరసయుక్తము.

౪

నాలవవారు గంగా భగీరథీసమానురాలైన శ్రీకైవారం బాలాంబగారు. ఈమె తెలగాణ్యశాఖీయులగు వైదిక బ్రాహ్మణి. ఈమె భర్తగారు మంగళగిరియం దుండువారు. ఆయన మరణించినతరువాత నీమె శ్రీ మంగళాద్రిపై కొంతకాలము తపమానరించి, శ్రీహరి యనుగ్రహమును వడసి, శ్రీహరిసేవయే తనకు కర్తవ్యమని నిశ్చయించి శ్రీహరిప్రీత్యర్థ మంగళగిరిక్షేత్రమున ననవరతము నన్నదానమును జేయుచుండును. కులమును గోత్రము నడుగక; అన్నార్తులందరును దానార్హులనే యెంచి తృప్తిబరచును. వారువీరనక యన్ని జాతులజనులకు నీమెయే మంగళగిరిక్షేత్రమం దాదరించి యన్నము బెట్టు తల్లియని చెప్పవచ్చును. ప్రతి ముక్కోటియేకాదశికి వీరియింట అధమ మొక యయిదువేలమందియైన భుజింతురు. ప్రతి ఫాల్గుణ శు॥ పూర్ణిమకు శ్రీలక్ష్మీనృసింహస్వామివారి కల్యాణోత్సవములు జరుగుసమయమున, వీరియింట్లో పెద్దసంఘములు. పదిరోజులు ప్రతి పగలు రాత్రియు కొన్నివేలమంది యిట భుజింతురు. వీరు జేయు యాదరమునకు మేరలేదు. గోదావరీమండలమున గన్నవరమున నన్నదానమునకు ప్రసిద్ధులగు శ్రీమతి డొక్కా సీతమ్మగా రను వారొకరుండెడివారు. వారి కీర్తి దిగంతవిశ్రాంతము. వారితరువాత నన్నదానమునకు పేరు జెప్పవలసినవారు శ్రీ బాలాంబగారినియే చెప్పవలయును. శ్రీహరియే శరణ్యుడని నమ్మి యాతడే స్వామియుడని నిశ్చయించి, భూతతృప్తి జేయుటయే శ్రీహరిసేవయని ప్రవర్తించువారల జీవిత మెట్లుండునో మంగళగిరి శ్రీబాలాంబగారి యింటికిపోయి ఫాల్గుణ శుద్ధపంచమి మొదలు పూర్ణిమవరకు నటనుండిన చక్కగ బోధపడగలదు. ఓం తత్సత్.

— చెరుకుపల్లి బుచ్చిరామయ్య.

# విప్రయోగి

(షెల్లీపద్యముల కనువాదము)

కొప్పర్తి నారాయణ, బి. ఎ., ఎల్. టి.



ఏటు లన్నియు బ్రవహించు నేటఁ గలియు
సాగరముఁ జేరఁ దుముకు నిర్ఝరచయంబు
గగనవాయువు లొండొంటిఁ గౌఁగిలించు
హర్షసంభ్రమోత్కృష్ట సంఘర్ష మనగ
తనకుఁ దా నొంటిబ్రదుక నిలఁ దగముగాదె!
దైవమర్మ ప్రపాలన ధర్మమునను.
ఒకటియొకదానితో నైక్య మొందగాను
ఊర్జితముగ నింగలయ కే నుండ నేల?
భూధరాగ్రముల్ దివినిక్కి ముద్దుగొనును
పొరలు తరగము లొండొంటిఁ బొందుగాంచు
తోడిసుమముల నిరసించు దుడుకుతనము
కలిగినపుడు పూవులఁ గరిసమూని.
చంద్రికలు వ్రాలిముద్దిడ సంద్రమెగయు
కుపలయేశుని కరములఁ గుంకరేయు
దినకరాశ్లేషమున భువి తేజరిల్లు
ఇట్టి చుంబనాశ్లేషము లేమిలెక్క
నీవు నను గౌఁగిలించి ముద్దీయకున్న!

---

# నవీనాంగ్లకవులు



వాల్మీకిమహాకవి కరుణాంతరంగుడు. నేలగూలిన పిట్టకై వగచి మొదటిపద్యము నుచ్చరించెను. రామగుణానురక్తుడై యుప్పొంగి రామకథామృతము నుత్పత్తిజేసెను. "శ్లోకత్వమాపద్యత యస్య శోకః." నానాదేశముల ఆదికవులు ప్రకృతిసౌందర్య మవలోకించియు, మహాపురుషుల వీరోదారగుణగౌరవంబును మెచ్చియు, అందున జనించు రసభావ నిరంకుశావేశమును పట్టజాలక, వాగ్రూపమున వెల్లడింప నొక్కటి పద్ధతిని తేర్పడినవి. వీరు చూచినవియు, అనుభవించినవియు వీరి సంభావనాపరిభావమున వన్నెచిన్నెలు దాల్చి, వీరి వినిర్మలాంతఃకరుణారంగంబున జగద్వ్యాప్తిసత్త్వమును జెంది యాదికావ్యము లన శ్లోకములు చున్నవి. రసావేశచోదితంబులుగాన కృతకృతులు సామాన్యముగ గేయమాధుర్యమొప్పారు లలితపదపుంజములతో గూర్పబడినవి. వీరికల్పనాసంతానములు కావ్యలక్షణములై తరువాతికవుల బాగోగులకు హేతువులై పరిణమించెను.

కవులావల, రాజానుగ్రహము వడసి, ధనికులగొలిచి, వందిజనంబులై యేలికల వేడుకకొరకును, మెప్పుకొరకును, లక్షణబద్ధమైన ప్రబంధముల నేర్పరుపసాగిరి. కొందరచ్చటచ్చట బరమేశ్వరుని లీలానుస్వరూపముల నభినందించుచు, భవబంధవిమోచన మరయుచుండిరి. ఏదనో ఒకడు రసభావోద్వేగమున నాత్మసంతృప్తికై పద్యము లల్లుచుండెను. దేవభాంతి యూగితిలో నస్తమించెను. యూరోపుఖండమున నిట్టివాఙ్మయవ్యవస్థ 1770 వరకుండెనని చెప్పవచ్చును.

దరిమిలాన యూరపులో స్వభావకవిత్వ మనదగునది (Nature Poetry) యుదయించి, సద్విషయముల గుణరూపభేదముల బాటింపక, కావ్యోచితేతివృత్తముగ నంగీకరింపుచు ప్రకృతియందును, మానవజంతుస్వభావము లందును గోచరించు పరతత్త్వ మూహింపుచుండెను. కావ్యము, నిబద్ధమర్యాదలైన ప్రభువులకుగాని, యపారగుణాలంకృతుడైన పరమేశ్వరునకుగాని, సంబోధింపు తెరవులదప్పి జనసామాన్యమును జూచుచుండెను. ఇందుచే కవులిష్టము చొప్పున స్వతంత్రసంచారశీలురై కావ్యముల గాథారూపముల బలురీతుల విస్తరించిరి. స్వభావవర్ణనము మెల్లగ దివ్యజ్ఞానసూచకమై "సర్వముకాని దివ్యకళామయమంచు" నూహింపసాగెను. అనిర్వాచ్యనిర్మలానందసంశోభితంబగు (Mystic Poetry) కావ్యప్రయత్నములు పాశ్చాత్యమతిసాంఘిక సాంప్రదాయములలో వికసింప నవకాశముగానక, యూరపు భూభాగవాసులందరు నీనాడు హైందవకవితామృతబిందువుల రుచిగొని యానందించుచున్నారు.

దీపాశ్చాత్య భావదాహము నపనయించి విశ్వవిఖ్యాతుఁడై యున్నాఁడు.

పౌరాణికులనఁదగు మొదటికవులు ప్రకృతియందును, మానవనైజమందునుగల గొప్పవిశేషముల భావింపుచుండిరి. ప్రబంధరచకులగు మధ్యకాలపు కైతగాండ్రు ఏదో ఒకవిశ్వవ్యాపివిభూతినో ప్పారాధనను జిత్రింపుచుండిరి. వీరు వాఙ్మయచిత్రకారులు. ఆధునికులగు స్వభావనిరూపకులు అన్నివిషయముల కావ్యోచితకల్పనాగ్రామముగ సంగీకరించుచున్నారు. నానాదేశముల పద్యవాఙ్మయచరిత్ర మీవిధ వికాసమొందియున్నది. మహావీరుఁడు, సామ్రాట్, పల్లెజమీదారుఁడు, వర్తకుఁడు సామాన్యమానవుఁడు కాలక్రమమున మానవసంఘనేతృత్వశక్తిప్రభావమంతరించి, సంఘప్రభావ మున్నతిగాంచుచుండ నాయాకాలధర్మముల ననుసరించి కవితారీతులు వేర్వేరుదారుల ననుసరించినవి. ఏకాలమున నేరీతికావ్యము లేర్పడినను, మానవులకవి రెండువిధముల నుపకరించుచున్నవి. నీతివర్తనముపలని లాభముల దెలుపుచు, నవినీతినాశనకారణమని యెఱిఁగించుచు, నున్నతమైన, సుందరమైన, పవిత్రమైన జీవనాదర్శతత్త్వముల నిర్ణయించుచు సుఖానందములు పరహితవ్రతము నెల్లకావ్యములు నెలకొల్పుచుండును. తరువాత—నీశ్వరాంశము జగన్మయమనియు, వాని లీలాసంకల్పఫలములై నానావిధములగు పెద్దచిన్నలు, సుగుణదుర్గుణములు, గలుగుననియు నిదర్శించి, సర్వభూతములయం దనుకంప ముదయింపఁజేసి, మానవనైజమును స్వార్థసంపాదనాద్యభిచారదోషముల నుండి మఱలించి పరమేశ్వరుని యనూనవైభవప్రభావముల కచ్చెరువందఁజేసి భక్తివిశ్వాసభక్తితులగ నొనర్చు సామర్థ్య మెల్లకావ్యములకుంగలదు.

కాలక్రమమున కవులు, పౌరాణికులు, ప్రాబంధికులు, స్వాభావికులు, దివ్యజ్ఞానసూచకులు అని చెప్పియున్నాము, నిజముగా నిది ఆయాకాలముల సామాన్యకావ్యలక్షణమును సూచించునేగాని, యెల్లకాలములలో నన్నివిధములగుకవు లుండి, తమతమ యింద్రియవికాసమును, మేధాసంపత్తిని, ఆత్మసంస్కారమును ననుసరించి, రసభావసంస్ఫురణముల నందుచుందురు. కవులలో గొందఱు ద్రష్టలై, కాల్పనికులై నగ్ననిర్దేశములఁజేయ నోపియున్నారు. కొందఱు యోగులై ప్రకృతివిలాసప్రచారములం దొకమహాద్భుత శిల్పనైపుణ్యమును, ధర్మసామ్యతను, దివ్యసంకల్పమును జూచుచుందురు. వీరు స్వభావమును వేర్పఱచి వర్ణించియు గుణరూపాతీతమైన తత్త్వమును నియుద్బోధించుచుందురు. స్వాభావికకవులు ప్రత్యక్షము నభినందించుచు తాము చూచిన, అనుభవించిన, విషయములను యథార్థముగ జిత్రించుచున్నారు. అలంకారప్రియులైన ప్రబంధకవులు తమ ప్రత్యక్షానుభవానుభవములను, విశ్వావలోకనములను మేధాశక్తుల విస్తరించి, పన్నెండు చిన్నెల నొనగూర్చి, స్వభావసందర్భముల నొకభావనా చిత్ర్యమును గల్పించి, పౌరాణికప్రతిష్ఠ లేకున్నను, సామాన్యోచితమైనదానిగ జేసి, పదప్రౌఢిసౌష్ఠవంబుల నలంకరించి యందముగను, లలితరసోద్దీపకంబుగను, కావ్యము నమర్చుచున్నారు. ఇక భావకవులనువారు (Lyrical Poets) స్వభావావలోకనప్రేరితములైన సూక్ష్మాంశముల దలపోయుచు రసవ్యక్తి గరిపించుచుందురు. పౌరాణిక ప్రాబంధిక స్వాభావికకవులు మన్వంతరయందు పైఁజెప్పిన గుణవిశేషములు వేర్వేఱుప్రభావములతో నెక్కువతక్కువగ జేర పుంకొన్నచుండును. అందఱు గుణరూపధర్మపరిమితిగల ప్రపంచమును జ్ఞానేంద్రియమనోబుద్ధ్యహంకారపరిమితమైన తమ మేధస్సులతో నవలోకింపుచుందురు. అందఱు ప్రకృతియందలి రూపమును భావమును రసమును జూచుచుందురుగాని వీరిలో సత్కావ్యకర్త యెవ్వరైనను కావ్యపాఠకుల కత్యానంద ముదయింపఁజేసి దానియందలి ప్రాముఖ్యతనొసంగ నుత్సాహించుచును. నిజముగా కావ్యవాఙ్మయపు ప్రధానతత్త్వములో ప్రాచీనము నవ్యమను ఆధునికము అనుభేదములు లేవు. కాలవ్యవస్థయే కాదు; దేశవ్యవస్థయు కావ్యమునకు లేదు. కావ్యములందు గోచరించు భేదములన్నియు కావ్యోపయోగమునకుగాని కావ్యకారణమునకుగాని చెందినవి కావు. ఇవి వృత్తిని దేశకాలముల ననుసరించి మారుచుండుటను కవులమనీష విశేషముగ నుండుటను కావ్యభేదము లమరుచున్నవి.

ఆంధ్రవాఙ్మయమున నిలిచియున్న మొదటిమహాకావ్య సంకల్పము భారతాంధ్రీకరణము. "అస్మదీయవంశమునం బ్రసిద్ధులై విమలసద్గుణశోభితులైన పాండవోత్తములచరిత్ర నాపు పఠితంబు వినంగ నభీష్టమెంతయు" అని రాజనరేంద్రుఁడు దానినీయ తదాస్థాన విద్వత్కవీంద్రుఁడు దానిని జేపట్టి తనపోషకున కంకితముగా గొంతవఱకు నిర్వహించెను. తిక్కన ఇష్టదేవతాస్తుతిమున దైవసంకల్పప్రేరితుఁడై యాకార్యమును గడతేర్చి కైవల్యమొందెను. వీరిరువురి సాంప్రదాయములే ఇరు

వదియవశతాబ్దమువరకు ఆంధ్రకవుల సంకల్పకారణములై యున్నవి. తెలుగుకావ్యములు రాజమహేంద్ర సామ్రాజ్యవైభవంబున మొలకెత్తి, రెడ్లపెంపున బల్లవించి, ధనికులప్రాపకములో విస్తరించి, విద్యానగర భూపవాదరణ బుష్పించి, సరసామోదశోభితములై చిత్రకాంతులజెన్నొంది, కావేరీసలిలశీతలానిలంబున ఫలించి, పిల్లదొరల యల్పోపహారమున బ్రాణధారణమొనర్చి, యల్లనల్లన నాంగ్లనాగరకశోభావిరాజితంబులగు రాజమహేంద్ర చెన్నపట్టణముల నాశ్రయించి, నూతనవసంతవిలాసవంపదలనొప్పి, ప్రజాసామ్రాజ్యపోషితమై పలురంగుల జెలంగుచున్నది. నన్నయమొదలు తిరుపతివేంకటేశ్వరులవరకు ఆంధ్రవాఙ్మయతరంగిణి నానావట్టుల ద్రొక్కి తిరుగుచుండెను. ఒకచిన్నపాయ పోతనాదులు నివసించు దివ్యారామములపొంత బారుచు, శతకకవుల యర్ఘ్యోదకంబుల పడునాగిలిగి తడియాకపల్లెటిసీమలగుప్తభాగవతుల నిర్మలాంతఃకరణంబుల దడుపుచు నెందు, వనిదెరుంగని ప్రచ్ఛన్నసంచార మొనర్చుచున్నది. రాజకవిగాని, భాగవతకావ్యకర్తగాని, లౌకికపరిజ్ఞానము లేనిదే, భావోద్రేకమొందనిదే, రసానుభవము జెందనిదే, ప్రకృతివైచిత్ర్యములు జూచి సంతసింపనిదే, సకలజనామోదకంబగు కావ్యకల్పనలు చేయజాలడు. కాని "కావ్యంయశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే" అనునట్లు ఆంధ్రకావ్యారంభమునసుండి 1908 వరకు ఆంధ్రకవులు ధర్మనిష్ఠయో, ప్రభుసంతోషణమో, ధనాసక్తియో, మోక్షకామమో పేరువాసియో ప్రేరేపింప లోకోత్తరకావ్యయత్నముల గొనసాగించిరకాని, ఇందున నొక్కడేని యు జగద్వ్యాప్తమగు భూతదయతో మానవసంఘమును ప్రేమించుచు ప్రకృతిసాహచర్యమున రసభావపూర్ణములై కావ్యముల నాచ్చరించినవా రగుపడుట యరుదు.

పోతన, తిక్కన, సూరన మున్నగుకొందరి కల్పనలు చూచినచో, సంస్కృతకావ్యముల సత్పఠనమే కాక అత్యధికమైన లౌకికజ్ఞానము, మానవప్రచారసాంప్రదాయాభిజ్ఞత, రసౌచిత్యము, స్వభావాభివర్ణనము గోచరించును. వీరు నిజముగా కొంతచూచియు, అనుభవించియు, మిక్కిలిసంభావించియు, ప్రకృతిస్వభావముల రుచికరముగ నభివర్ణించియున్నారుగాని, దానినెల్ల కావ్యోద్దేశ్యమునకు లోబరచి యందలిసూక్ష్మాంశముగ రచించియున్నారు. మరియు నీశ్వరాంశము జగద్వ్యాప్తముగ నంగీకరించియు, [illegible]లపు సామాన్యరసవ్యవస్థ నెరింగియు, మానవునె ప్రధానాంగముగ సంగ్రహించి కావ్యగాథల గల్పించియున్నారుగాని, మానవేతరమగు భూతజాలమున నెట్టిభావవ్యక్తినిగాని రసానుభవశక్తినిగాని యాపాదించియుండలేదు. ప్రకృతి మానవమానసంబున రసోద్దీపన మొనర్చునదిగ నంగీకరింపబడినది. అందుచే ఋతువర్ణనాదులు "విరహాపులచాటున లేదుగదమ్మ చెప్పరే" యని సంబోధించుటకూడ కానవగు. కాని ప్రకృతివలన జవాబేమియు రాదు. ప్రకృతితో సంభాషించుచు, దాని భావవ్యక్తి నభివర్ణించుపోకడలు 1907 వర్ష ప్రభృతి తెలుగుసారస్వతమున బొడకట్టినవి. ఈవ్యాసమాలికలో ప్రధానాంశముగ నీ స్వభావకావ్యవైచిత్ర్యమే వివరింపబడును.

తొల్లిటి యాంధ్రకవులు పౌరాణికులు. వీరు గీర్వాణసాహిత్యపారంగతులు శ్రుతి స్మృతి పురాణేతిహాస ప్రపంచసంచారులు; రాజ్యకార్యధురంధరులు; పరమలౌకికులు. నన్నయ్యమొదలు విద్యానగర కవితావిర్భావ మహోన్నత్యము వఱకునుగల తెలుగుకవులు సంస్కృతపాండితీధురీణులైన లౌకికులు. తిక్కన, కవిసార్వభౌముడు, ప్రబంధపరమేశ్వరుడు, పోతనామాత్యుడు పాండిత్యమునకు లౌకికపరిజ్ఞాన మెక్కుడుగ జతపఱచి, కల్పనాచమత్కృతి వలన, ప్రబంధములయొక్కయు, ఆధునికనాటకములయొక్కయు, బీజాంకురముల నేర్పఱచియుండిరి. విద్యానగర కవితావిర్భావసందర్భమున 16వశతాబ్దమున వన్నెకెక్కిన పెద్దన, తిమ్మన, రామకృష్ణులు పాండిత్యసంపదలకన్న రసానుభవ మెక్కువగ గలిగియుండిరి. ఆకాలముననే బ్రాహ్మణేతరుడు కవితాశక్తి ప్రకటింప మొదలిడెను. పింగళిసూరన (17వ శతాబ్దము) కర్ణాటసామ్రాజ్యవినాశానంతరము రసవత్ప్రబంధనాటకముల నల్లుటచే, లౌకికానుభవము, భావసౌష్ఠవము, కథౌచిత్యము ఎక్కువగ పరిగణింపబడుచు, తెలుగుప్రబంధములు స్వాతంత్ర్యవికాసపూర్ణములై, సంస్కృతాలంకారలక్షణములకు దూరమై సహజాంధ్రప్రతిభావిరాజితములై యుండెను. ఇప్పటివఱకును ఆంధ్రకవిశేఖరులందరు లౌకికబ్రాహ్మణులే. తంజాపురి యాంధ్రకవితాలవాలమైనపట్టున, (18వ శతాబ్దము) పింగళిసూరనార్యుని వెనుకను, తెలుగుకవులు తెలుగుప్రబంధములను తెలుగులక్షణగ్రంథములను అవలోకించి ముఖ్యముగా భట్టుమూర్తి కవితారీతులననుకరించి కావ్యముల గూర్చుచుండిరి. ఈకాలములో చాతుర్వర్ణ్యులెక్కుడుగ కవితారంగమున వాసికెక్కిరి. ఇట్టి నాంధ్ర

భారతి నిద్రావిశ్రాంతినొందుచున్నప్పుడు, పల్లెటూళ్ళ, పేరెన్నికలేని నియోగులు శతకకల్పనలను కొన్ని సందర్భములలో రసవంతమైన కావ్యములను జేయుచు గుప్తయశోనిధులై మరుగుపడియుండిరి. భట్రాజులు శ్రీపదంబుల నాశ్రయించుచు, తెలుగుప్రబంధముల రసవద్భావగాంభీర్యమును వెల్లడింపక, శ్లేషాదిబంధకవితా తెరంగుల నలుదెశల బ్రోగించుచు, భాస్కరదానశీలమును గీర్తించుచు తలమార్చినపద్యములతో మెప్పించి మెప్పులబడయుచుండిరి. ఈగతి నాంధ్రభారతి 1840 సంవత్సరమువఱకు నధోగతి జెందియుండెను.

ఇంతలో 19వ శతాబ్దారంభమునందు గోలకొండ నెల్లూరు ఆర్కాటు నవాబుల యాధీనమునయున్న యాంధ్రదేశము విచ్ఛిన్నమాయెను. జేరాయి మధ్యపరగణాల యాంధ్రులు మహారాష్ట్రపరిపాలనమున జేరిరి. గుంతకల్ – బెంగుళూరు రైలునకు పడమటనున్న తెలుగుసీమలు హైదరల్లీకిలోబడి క్రమముగ మహీసురరాజ్యభాగమున జేరెను. చెన్నపురి–బెంగుళూరు రైలునకు దక్షిణమునయున్న యాంధ్రభూములు, మతసాంప్రదాయములచేతను వైష్ణవప్రపత్తిచేతను తమిళనాటికి ప్రభాక్రాంతములై తెలుగుతత్త్వముల వీడెను. దత్తమండలములు సైన్యసంరక్షణముకొరకు కాంగ్లేయులకీయబడెను. (1805) ఈప్రాంతములలో మొగలాయిపక్షమున, ఆనెగొంది, గద్వాల, వనపర్తి సంస్థానములు నిలిచియుండెను. దత్తమండలములు స్వల్పభాగమున పండువిగానను, చాలభాగము మన్యములతోనిండి సేద్యానర్హముగనుండు గావునను, క్షామకంటకము లచ్చట దఱచు తలజూపుటను, పండితపోషకులగు సంస్థానములు లేనందునను, దత్తమండలము లాకప్పు డాంధ్రవిద్యానటీనృత్యరంగస్థలంబులై నెన్నొందియుండియు, క్రమముగ బ్రాహ్మణప్రతిభాదరిద్రమునకు పాలైనవి. పోషకులులేరు. క్షేత్రారామములకువలయు నీటివసతులు లేవు— బ్రాహ్మణాగ్రహారములు లేవు— పండితులు లేరు. దత్తమండలముల దౌర్భాగ్యమాంగ్లేయు విద్యాప్రతిష్ఠాపకులగాని, ప్రభువులగాని యాకర్షింపకుండెను. ఇంతలో తంజాపురినుండి చెన్నపురికిని, చెన్నపురినుండి ముంబాయికిని రైలుమార్గము లేర్పడెను. తంజాపురీప్రాంతమునగల హైందవసాంప్రదాయ దుర్గమదుర్గంబుల భేదించుకొరకు, క్రైస్తవమిషనరీ లచ్చట 19వ శతాబ్దారంభమున నాంగ్లసద్యాలయముల నేర్పరచిరి. ఉద్యోగవశమున దాక్షిణాత్యులు చెన్నైపరిసరములన్నియు నాక్రమించి వాని నాంధ్రేతరములొనర్చిరి. వీరలాక్రమణమునకే అయోమార్గావకాశమున దత్తమండలముల కెగబ్రాకి కడప, బళ్ళారి, కర్నూలు ప్రాంతముల తమనాగరికసత్వముల వెదజల్లి యచ్చట స్థిరవాసులైరి. మరిగాన నాప్రాంతములు త్వరితముగనుండి మహారాష్ట్ర పారసీకప్రవాసుల యావాసములాయెను. ఆంధ్రవిద్యాపీఠములులేవు. ఆంగ్లవిద్యావ్యాపనము తక్కువ. అరవపారసీక నాగరికతా విజృంభణమెక్కువ. బ్రాహ్మణప్రపత్తి కొదువ. ఇందుచే నాయెడ నాంధ్రజాతీయ సహజకవ్యోదయము లేకుండెను. ఇటీవలమాత్రము అరవ, కన్నాట, పారసీక, మరాటీ సాంప్రదాయానుసారముగ నాటకములల్లు ధర్మవరం కృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావుగారు అచ్చోట జనియించిరి. దత్తమండలములలో జాతిసాంకర్యమెక్కువగనుంటచే, [illegible], మిగిలిన భారతిభాషవిన్యాస[illegible], భక్తితో శృంగారములతోగూడిన పురాణగ్రంథసమాసంగమై యున్నది.

నెల్లూరు చిత్తూరు ప్రాంతములు వైష్ణవసాంప్రదాయమునను, నాయిళ్ళ యంటుబాటునను, చెన్నపురియొక్క విలాసగ్రాములై యాంధ్రత్వమును గోలుపోయెను.

19వ శతాబ్దారంభమున నాంగ్లేయు లుత్తరసర్కారులను నిజాంవలన కైకొనిరి. ఆగౌతమీతటవ్యాప్తమయిన కళింగరాజ్యవిభూతిని బద్మనాభరణకుటుంబుల పసజెరచి, యాభాగమంతయు స్వవశము జేసికొనిరి. సువర్ణముఖి మొదలు నాగావళివర కాంగ్లేయప్రభుత్వమేర్పడెను. కాళహస్తి, వెంకటగిరి, నూజవీడు, పిఠాపురం పెద్దాపురం, బొబ్బిలి సంస్థానములలో వెలమదొరలును, విజయనగరములో పూసపాటిక్షత్రియులును సామాన్యవైభవోపేతులై స్వాతంత్ర్యరహితులయిన భూస్వాములయిరి. తెల్లదొరలు బలిగ్రహణసౌకర్యమున కనేకచిల్లరజమీదారుల నుత్పత్తిజేసిరి. పినాకిని గౌతమీ కృష్ణవేణి మహావాహినులేగాక, తూర్పుకొండల సెలయేళ్లసంఖ్యాకములు సాగరాభిముఖులై పారుకతన, ప్రాగాంధ్రభూభాగము ఫలసస్యశోభావిభాసితమై బ్రాహ్మణావాసములతో నిండియుండెను. ఈప్రాంతముల వైదికులలో సంస్కృతపాండితీప్రాచుర్య మధికముగనుండెను. పల్లెటికరణాలకుటుంబములలో నూతనకావ్యోత్పత్తి వాసిగలేకున్నను, తిక్కన పోతనాదుల కవిశీలమరియుండెను. 1840 దరిమిలాన ఆంగ్లశిల్పకులు

గౌతమీ, కృష్ణవేణీ పినాకినుల కానకట్టలేర్పరచి, దేశమును క్షామరహితముగ నొనర్చిరి. దక్షిణాదిన 19వ శతాబ్దారంభమున నేర్పడిన యాంగ్లవిద్యాప్రకాశము ప్రాగాంధ్రదేశభాగమున 1850 వరకును వ్యాపించలేదు. ఇందుకుతోడు చెన్నపురీ-కలకత్తాలనుండి ఆకాలమున నేర్పడియుండిన యుద్ధ తయారైన తిమిళులు మనదేశము నాక్రమించి, తెలుగు తెలివిని రూపుమాపియుండిరి. ఆంధ్రమాతకడుపుచలువచే నీటనుండి 1900 వరకు నేర్పడలేదు. ఇంతలో 1850 లో నేర్పడిన ప్రవేశపాఠశాలలలో రాజమహేంద్రవరము, విజయనగరం, బందరు లోనివి సుమారు 1875 కు కళాశాలలాయెను. కలకత్తానుండి వాల్తేరువరకు, అచ్చటనుండి రాజమహేంద్రవరమునకు బండి ముందుగా పడెను. మరియు స్టీమరుపై బందరు, కాకినాడ, విశాఖపట్టణములనుండి కలకత్తాకు రాకపోకలుండెను. ప్రాగాంధ్రభాగ మదినదికే మహమ్మదీయ, కళింగ, మరాటీ, పఠాను, సాంగ్లేయసైన్యముల దాడులకాటపట్టయి, వివిధమతసంచారముల, కాలవాలమయి, మహాసామ్రాజ్యములు గాని, మతపీఠములు గాని లేక, పిల్లరాజులతో, చిల్లరదేవుళ్ళతోగూడి పరాధికారదాస్యములకు లోనైయున్నందున, నీప్రాంతములలో మత, భావ, సాంఘిక, రాజకీయవిషయములలో స్వాతంత్ర్యము, అధికారతిరస్కరణము సంపూర్ణముగ నలవడియుండెను. ఇంతియగాక, నల్పవ్యక్తు లనేకు లేకముఖమున బని సేయుచు మహాకార్యముల నిర్వహించు ధైర్యస్థైర్యములు, ప్రతినిష్ఠ ఇచ్చట నేర్పడినవి. తొల్లి ద్రవిడ, కర్ణాట, మరాట, మహమ్మదీయ, కళింగ నాగరికతాంశముల కాటపట్టయిన ప్రాగాంధ్రభూభాగము, శైశవమువదలి చే 19వ శతాబ్దాంతమునను, 20వ దానియారంభమునను, వంగ, మరాటీ, భావవాహినీసంపోషితం బాయెను. బ్రహ్మసమాజము, సంఘసంస్కరణము స్వదేశోద్యమము స్వరాజ్యాభిలాష, జాతీయవిద్య, యహింసావ్రతము మున్నగు నవీనభావతరంగములు నలవడియుండిన, సంపద్విశాలమయిన, బ్రాహ్మణతపస్సంపన్నమయిన, బల, ధీసమన్వితమయిన యీప్రాగాంధ్రభాగమున జెలరేగినవి. చెన్నపురివారలు 1900 వరకు రాకుండుటచే నాంధ్రసత్వము తమిళతంత్రములనుండి కాపాడబడుటయేగాక ఆంధ్రవ్యక్తు లిచ్చట స్వతంత్రభావప్రకాశ మొంది చెన్నపురి నావహించు శిక్షాబలోద్వేగముల నేర్పరచినది.

తంజాపురీసంస్థానప్రభావాస్తమయము మొదలు 1840 వరకు తెలుగుకవిత్వము పండితేతరులయినవారి యాధీనమున నుండెనని చెప్పియున్నాను. ఆసమయమున ఈనాంకమీష నుత్తరసర్కారుల బరిశీలించి, యచ్చట సంస్కృతి సాంప్రదాయానుగతమును విద్యాప్రచారావకాశముల జాలవరకు నేలగిలిపెను. స్వాతంత్రజీవులైన పండితకవులు బహు లనేకులు జీవనోపాధికై, ప్రభువులనో, ఆంగ్లపాఠశాలలనో ఆశ్రయింపవలసివచ్చెను. ఇంతలో కాళహస్తినుండి బొబ్బిలివరకు వ్యాపించిన సంస్థానమాలిక నూతనప్రభుత్వాధికారులతో కుదిరి, స్వస్థులై, విభవోపేతులై పండితసత్కారము జేయనోపియుండెను. అచ్చటచ్చట తెల్లదొరలచే స్థాపింపబడిన పాఠశాలలకు పండితు లవసరమాయిరి. ఇట్లు ప్రభుసేవలోను, పాఠశాలలయందును జేరినపండితులలో ననేకులు వైదికులు వైష్ణవులునుండిరి. వీరందరు గీర్వాణసాహితీ సాంప్రదాయాభిజ్ఞులు. అదివరకు వైదికులు, వైష్ణవులు వేదశాస్త్రముల నభ్యసింపుచు, తెలుగుకవిత్వమును నిరసించుచుండిరి. లౌకికులయిన నియోగులు, వందిజీవులైన భట్రాజులు దీని మన్నింపుచుండిరి. ప్రభుసేవాసందర్భమున శుభాదికార్యములలో బండితులు ప్రభువుల కర్హమగు తెలుగున కవిత్వవైఖరుల బ్రకటింపవలసెను. పాఠశాలలలోనిపండితులు తెలుగు కావ్యముల బోధింపుచు, నాంధ్రకవితాధునీ, మధురాలాపముల మోహమునకావ్యకంఠు లాయిరి. ఇట్టి పండితకవులప్రచార మాంధ్రదేశములో 1840 మొదలు 1895 వరకును జరిగిన శతాబ్దార్ధమున నుండెనని చెప్పవచ్చును. గోపీనాథం, వెంకటకవి, శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి, మండపాకపార్వతీశ్వరకవి, కోరాడ రామచంద్రశాస్త్రి, మాడభూషి వేంకటాచార్యులు, పేరి కాశీనాథశాస్త్రి మున్నగు పెద్దలీవ్యాప్తమున జేరినవారే. వీరు సంస్కృతసాహిత్యసాంప్రదాయముల జక్కగ గుర్తించి, సూరనార్యుని యనంతరము తెలుగుకవిత్వమున కేర్పడిన పాండితీదారిద్ర్యమును దీర్చిరి గాని, వీరి కవితాప్రయత్నములు లౌకికజ్ఞానరహితములై, పాండితీప్రాగల్భ్యదూషితములై, కులప్రవాగతనైపుణ్యములేమిచే నింపుదప్పియున్నవి. ఆంధ్రకవిత్వమునకు విశుద్ధతను, వ్యాకరణాలంకారసౌష్టవమును జేకూర్చి, దేవభాషాప్రతిభను మరల నీపండితకవులు సమకూర్చియిచ్చిరి. ఈసాంప్రదాయములతో సంస్కృతాంధ్రపాండితీగరిమ సంపాదించి, శుద్ధవైదికులయ్యును సరసకవితాసామ్రాజ్యసింహాసనారూఢులయిన విద్వత్కవు లనేకు లిప్పటికిని జీవించియున్నారు. ఆనంద గజపతీంద్రుని యాస్థానకవు లిట్టివారలే.

పండితకవులు కాల (1845-1895) మెక్లైటులో చెల్లుచుండ, నప్పటికే కృష్ణా గోదావరీ విశాఖపట్టణమండలములలో వ్యాపించుచున్న యాంగ్లవిద్యాలయములలో కొంచెమింగ్లీషు నభ్యసించి, కొంత తెలుగు, కొంత సంస్కృతము చక్కగ నేర్చి, ఆంగ్ల, నాగరికసాంప్రదాయములను, ఆంధ్రగీర్వాణవిజ్ఞానమును గౌరవించి, యాంగ్లవిద్యాలయములలో పండితులై, నవీనభారత భావోన్మేష మెరిగిన తెలుగుకవులు, వైదికినియోగు లిరుతెగల వారు (1885 మొదలు 1905) వరకును, ఆ ప్రధానప్రవృత్తివివర్ధకులై యాశయముగాంచిరి. వీరేశలింగము, వసురాయడు, వేంకటరత్నము, వేంకటరాయశాస్త్రి, వావిలుకోలను సుబ్బారావు, కృష్ణమూర్తిశాస్త్రి మున్నగు వారొకవైపు సంస్కృతనాటకాదుల దెనిగించియు నొక వైపు నాంగ్లనాటక కావ్యఖండికల ననువదించిరి. కొన్నిరీతుల నాంధ్రకవిసింహముల పోకడల నాశ్రయించియు, తెలుగుకవిత్వమునకు విపులసంస్కారమిచ్చిరి. ఇట్టివిద్యాసాంప్రదాయములేకల కవులనేకులాంగ్లసంస్కృతకృతుల నాటకములను, గద్యప్రబంధములను, విమర్శనలను, భాషాంతరీకరణములను జేయుచు వచ్చిరి. 1885-1905 తెలుగు సారస్వతమున, ననుకారకయుగము. అందలిప్రముఖులు భాషాంతరీకరణమందును, అనుకరణమందును ప్రజ్ఞావంతులై, తెలుగుభాష కట్టులేని యుపకరించుచేతుకలో బాటుపడిరి. భాషాసేవయే ఈకవుల కావ్యప్రయత్నముల కారణమై యుండుటను, వీరు భావోన్మాదులై, ఉద్రిక్తులై, రసానుభవప్రభావమున కవిత లేర్పరుపలేదు. పాండిత్యమున, రచనలలో పండితకవుల కోడిపోవుదురు. భావసౌష్ఠవమున కవితోద్దేశ్యనిర్వహణమున, తరువాతి భావీయకవుల పోకడలు వీరి కేర్పడలేదు.

పండితకవులును, అనుకరణకవులును, వారిసర్వస్వ సంబంధమున, ఆంధ్రకవిత్వపు చరిత్రాంగమునకు చెందిన టులు నన్నయ—యఱ్ఱాప్రగడవరకు మొదలిసీను—పెద్దనవరకు రెండవది— సూరనవరకు మూడవది— తిరుపతి వెంకటేశ్వరులవరకు నాల్గవది. ఇవల నవీనాంధ్రకవితావిర్భావ మహోత్సవరంగమునకు తిరుపతి వెంకటేశ్వరులు సూత్రధారులైయున్నారు.

1905—1922 వరకున్న కవితాపటవాహకులు చాల వరకు, ఆంగ్లవిద్యాసంపూర్ణులే. వీరు ఆంధ్రగీర్వాణముల నల్పముగ నభ్యసించి, వెనుకటిరంగాధినేతల సహాయసంపదలపడసి, ముద్రణాయంత్ర సాహాయ్యమున నులభమైన నానాకావ్యముల ఆప్రకాశస్వత్వ మనుభవించి, జాతీయభావోద్వేగపరవశ్యమునను, ప్రజాపోషణలో నానాదేశముల విస్తృతవాఙ్మయపరిచయముపొంది ప్రోత్సాహమునను, విదేశసారస్వతాభిజ్ఞతను, వంగభావోత్సాహ సంపర్కమునను, ఆంధ్రోద్యమోద్యలిత మాతృసేవాపర్వమునను, గ్రాంథికవ్యావహారిక సాహిత్యరూపాభిమానమునన, పఠాన్యవ్యక్తిమార్గావసర సంజాత నూతనాభిప్రాయప్రాబల్యమునను దేశములో తాపరితంప నరైరాగము సాంఘిక రాజకీయవిప్లవముల వేడిమి చేతను, ప్రకృతి నవలోకించి. భూతజాలముతో సహా గోష్ఠులనెంచి, యానందించు కుతూహలమునను బలుతెరంగుల, నవభావ పుష్పాలంకృతములైన పద్యముల ప్రాయుచున్నారు. వీరిలో నాంధ్రనాట్యయుమున, స్వభావకవిత్వము ఆరంభమైనది. వీరిలో భానుమూర్తిగారు, మంగిపూడి వేంకటశర్మ, రాయప్రోలు సుబ్బారావు, గురజాడ అప్పారావు, సింగిరి లక్ష్మీకాంతం, కొటూరి వేంకటేశ్వరావు, సెట్టి లక్ష్మీనరసింహము మున్నగువారనేకులుగలరు. వీరు పూర్వులవలె పెద్దకావ్యముల దలపెట్టక, తమ రసావేశమును, అనుభూతివిషయములను, భావోన్మాదమును చిన్నపద్యఖండికలలో వెల్లడింతురు. ఇట్టి ప్రయత్నముల నిరూపించుచు, వీరికవితారీతులను, నానాకాలముల ఆంధ్రసారస్వతమునందుగల సామ్యభేదముల నరయుచు, నవనూతన భాషాప్రపంచసంచలనమున వీరి నియతిస్థానమును జూపుచు, నాంధ్రకవితాప్రయత్నముల కవశ్యమగుమార్గముల సూచించుటయే "ఆనవీనాంధ్ర కవు" లను ఈవ్యాసమాలిక యుద్దేశ్యము.

నవీనాంధ్రకవులలో పైచెప్పినవారుకాక, శుద్ధాంధ్ర సంస్కృత పాండిత్యముగలిగియు, 1885-1922 వరకును దేశములో వ్యాపించుచున్న భావప్రవాహమును గుర్తెరిగి దేశకాలోచితరీతుల నూతనకవితామాధుర్యసౌందర్య మొప్పారు, కవిశేఖరు లనేకులు గలరు. వీరికి నవీనభావములు కర్తాకర్తృ కలుగుటచే వారినవ్యయువ్యక్తియంతగ దోపక, నవీనభావవాహినిత్వము నంగీకరించక, లౌకికపరిజ్ఞానమును, నవీనభావసూచనలను, తమ పాండితీయంత్రమున శిక్షించి, అనుభవసారమును సంగ్రహించి, నిరుపమభాషామర్యాదలతో సరసముగ చెప్ప నేర్చినవారిలో తిరుపతివెంకటేశ్వరు లగ్రగణ్యులు. వీరివెనుక, కాశీ కృష్ణాచార్య, పురాణం సూర్యనారాయణ తీర్థులు, మున్నగువారనేకులు నూతనకవితా సామ్రాజ్యసంపన్నులీకాల

మున గలరు. వీరినికూడ నవీనాంధ్రకవులలో జేర్చి ప్రత్యేకముగ నొక్కొక్కరియొక్కగాని, ఒకవిధమగు కవుల గుంపునుగాని యొక్కొక్కవ్యాసములో జేర్చిగాని విమర్శించెదను.

1905–22 వరకుజరిగిన భాషోద్ధారకాపహాసములో సుమారు 200 కవులు సందర్భపద్యావళుల బ్రకటించియున్నారు. వీరిలో ప్రధానముగ దారిత్రొక్కిన కవితామార్గదర్శుల నెనిమిది ప్రత్యేకవ్యాసములలో విమర్శించి, చిల్లరకవుల కొకవ్యాసమొసంగి, భావికవిత్వమున కొకటియు, నవీనకవితాప్రయత్నసమన్వయమునకు రెండును సమర్పింపదలచినాను. ఈవ్యాసములు ముగియులోపలనే నవీనాంధ్రకవిత్వసారమును, పుస్తకముగా ముద్రించెదము.

ఈవ్యాసమాలికకు పండ్రెండుసంచికలలో వర్షవ్యాప్తప్రోత్సాహ మొసగినందులకు గ్రంథాలయసర్వస్వపత్రికాధిపతుల కెంతయు కృతజ్ఞుడను. ఆంధ్రసోదరులకు నావిధివిహితోపకారముగావించి యుత్తమగతుల నందియు నాపాలిటి కీపత్రికాప్రోత్సాహమే పదివేలు విలువ.

—పురాణం సూరిశాస్త్రి.

# రాధ పిలుపు.

మూడునాళ్లాయెరా ముద్దుగోపాల
నినుజూడకేనింక నిలువజాలనుర
కనులలో మెదిలేవు కనకగోపాల
నీచక్కదనమెందు దాచుకోగలవు
చాటుగా నిలుచుండి పాటబాడేవు
మరుగున తలవంచి మాటలాడేవు
మనసులో నేమిటో ముచ్చటాడేవు
తెరలోనరాగాలు తీసేవుకృష్ణ
మురళివాయింపగా వరహాలకృష్ణ
నీపాదలను బట్టుకోజాలుదేను
గజ్జెలందెలుమ్రోయ కదపరా కాలు
నీగుట్టునుట్టెల నే నెఱుంగుదును
నెమిలికుచ్చుతురాయి తళతళలాడి
నిను బట్టియిచ్చునంచును తీసినావె
నీచుట్టుపచ్చగా పూచేనటంచు
బంగారు కాలువా పారేసినావె;
ఎంతసేపాయెగా యౌవనాంతమున
నీకోసమొంటిగా పొంచికులాడితిని
ఎందెందు వెదకినా యాబృందయందు

నీవన్నెలేకానరావేల కృష్ణ!
పొదలలోపూవు నైపోయినావేమి
అలలోదుమ్మునై యరిగినావేమొ
తమ్మిలతీయగా ద్రవియించితేమొ
కలికివేణువులోన కరిగినావేమొ
నిన్నెందుజూతుగా చిన్నారికృష్ణ
ఏమూలవెదకేదిరా మోహనాంగి
వెన్నదొంగిలి కానిపింపకున్నావో
నీగతెల్సుకపోయి నూగమైనావో
తగాణులేనిను దారి తప్పించినారో
మధురలో పౌరులే మరపించినారో
ఏమిసేయుదునురా నాముద్దుకృష్ణ!
నినుజూడకేనింక నిలువజాలనుగ
రాధను శోధింప రాదురాకృష్ణ
రాధపైకోపింప రాదురా కృష్ణ!
పిలిచినుద్దియరా ప్రేమాలపింద
కలిసిక్రీడింపగా కళ్యాణకలిక!

—రాయప్రోలు సుబ్బారావు.

# భారతీయుల నాటకలక్షణము

కొంతకాలమునుండి భారతీయనాటకములను గూర్చిన విమర్శనములు స్వదేశ, విదేశభాషలయందెల్ల వెలసినవి. సంస్కృతనాటకాదర్శమును పరిశీలించి, విషాదనాటకములు లేకపోవుటనుగూర్చి చర్చించి, ఉన్న విషాద, మంగళ, మిశ్రనాటకములను నిరసించినవ్యాసములు మన ఆంధ్రమునగూడ కలవు. అప్రతిమానముగ చిత్రింపబడిన రసవంతములగు కాళిదాస, భాసనాటకములను మెచ్చుకొనుచు పాశ్చాత్యవిద్వాంసులు, కాళిదాసు డీ విషయమున షేక్స్పియరును మించినాడని వ్రాసినారు. విషాదనాటకములు లేకపోవుట కొఱతయే కాని మనకున్న మిశ్రనాటకములను విషాదములుగ చేయలేదని కవిని నిందించుట పొరపాటు. అదియొక ఆదర్శము. ఇది యొక ఆదర్శము. అది పాశ్చాత్యులది. ఇది మన భారతీయులది. మన భారతీయనాటకాదర్శములనుగూర్చియు, నాటకవాఙ్మయపరిణామమునుగూర్చియు పండిత టి. ఎల్. వాస్వానిగారు బాగుగ చర్చించియున్నారు. మన విమర్శకులకొఱకు ఆయన వ్యాసమును అనువదించెదను.

ప్రాగ్దేశములెల్ల సున్నతినొందిన కాలమున, భారతఖండమున పండితసభలు జరుగుచుండెను. వీనికి భూపతులు, రాజులు, భాషాభిమానులు సభ్యత్వులుగ నుండిరి. ఈసభలయందు గొప్పగొప్ప కవులకృతులు పరీక్షింపబడి, చర్చింపబడి, గౌరవింపబడుచుండెడివి. ఈసభలు నానితర విశేషములును పెద్దలతోగలిసిపోయినవి. హిందూదేశపు అభివృద్ధి, నాగరికము క్షీణించినపిదప ముగిసిన చారిత్రము. భారతీయప్రపంచము గ్రహణమునందువలె నీడలోకప్పబడి, తిరనిరాత్రియందు మునిగిపోయిన చారిత్రము దుఃఖకరము. అనడికి రేయినుండి భారతీయులు మెల్లమెల్లన మేల్కొనుచున్నారు. ఈక్షణమున దేశములో నలుదిక్కులను శ్రుతిస్మృతులలోని సదాచారమున నెలకొనినసత్యములను వెల్లడించుసత్కార్యమునకు విద్వాంసులును, పండితులును గడంగినారు. భారతీయాశయములు పాశ్చాత్యదేశములలో గౌరవింపబడుచున్నవి. ప్రాగ్దేశపువేదాంతము కేవలము కల్పనాచాతుర్యముగ నెంచబడుటలేదు. మధ్యధరాసముద్రతీరముననె నాగరకతరంగము లంతరించినవను హెగెల్ సిద్ధాంత మిప్పుడు గౌరవింపబడుటలేదు.

డాక్టరు పి. సి. రాయిగారు చేసిన పరిశ్రమకలన ఐరోపాదేశమున తరువాత కనిపెట్టబడిన ప్రకృతిశాస్త్రవిషయములు కొన్ని, చాలకాలముక్రిందటనె భారతీయు లెఱిగియుండిరని తెలియుచున్నది. "హిందూదేశపుప్రకృతిశాస్త్ర" మని డాక్టరు బి. ఎన్. సీలుగారు వ్రాసినగ్రంథము నూతనపరిశ్రమలను ప్రోత్సహించుచున్నది. ఐరోపాఖండపుగ్రంథకర్త యొకడు న్యాయశాస్త్రవిషయమునుగూర్చి వ్రాయుచు, రోమదేశపుధర్మశాస్త్రములోని వ్యక్తిసిద్ధాంతమును విమర్శించి సెగ్గింపమితిసిద్ధాంతమే సరియగునదనియు, సమితి కొక ఆత్మ కలదని భారతీయులు నిరూపించియుండిరనియు వ్రాసియున్నాడు.

కాలము కదచినకొలదియు, అవ్యక్తముగ మాసికొనియున్న భారతీయులజ్ఞానము, జీవము వ్యక్తమగుచున్నది. జీవనవేదమునకు, జ్ఞానజ్యోతికి పురాతనార్యులె మనకన్న దగ్గఱగనుండిరి. వారు మనకన్న పవిత్రులు. నిష్కపటులు. శిశువువలె నిర్మలులు. అందువలననే వారు సత్యతత్త్వము నెఱుంగగలిగిరి. కలాతత్త్వములను బాగుగ తెలిసికొనిరి. నాటకమునందు జాలనిపుణులైరి. ఇచ్చట భారతీయనాటకాశయమును, నాటకవాఙ్మయముయొక్క విలువయు, దానిప్రాశస్త్యమును, యథాశక్తిని దెలుపబడును. భారతీయనాటకము హైందవ బౌద్ధనాటకము. మహమ్మదీయులు హిందూదేశమునకు చేసినయుపకృతి చాలకలదు. వారిచిత్రకళలు, శిల్పము, భావగీతములు—హాఫిజుకవనము, మానసాలీ చిత్రకలిత—వారియుత్సాహశక్తి, వారివిశ్వేశ్వరారాధనము భారతీయభావమున ప్రతిఫలించెను. భారతీయజీవనమును కొంతమార్పు చెందించినవి. కాని మహమ్మదీయులు నాటకకళను తీసికొనిరాలేదు. పారసీకులకు, అరబ్బులకు, మొగలులకు జాతీయనాటకరంగస్థలములు లేవు.

కొంతకాలముక్రిందట భరతఖండము గ్రీసుదేశమునుండి నాటకమును గ్రహించెనని యూహింపబడెను. సంస్కృతమున తెరకు "యవనిక" అనిపేరుండుట నాటకములకు మూలస్థానము యవనభూమి—గ్రీసని తలంచిరి. ఈమాటకు యవనులచే చేయబడిన గుడ్డయని అర్థము చేయవచ్చుననుమాటను మనవారు మఱచిరి. హిందూ

